Regd No. M. 3815

ఏకప్రతి ౧౼౨

To Let

# గోలకొండపత్రిక

10304

ప్రతి సోమ, గురువారములందు వెలువడు ఆంధ్ర జాతీయ పత్రిక

సంపుటము ౧౮ ॥ హైదరాబాదు దక్కన్ తా. ౯. ౧౧-౧౮ స్వభాను ఆశ్వీజ బ. ౧౨ (౯-౧౧-౧౯౪౩) సోమవారము ॥ సంఖ్య ౪౭



## పాఠకులకు మనవి

గురువారమునాడు దీపావళి యగుట చేత పత్రిక వెలువడదు

## రోంనగరం ఖాళీ అగుచున్నది

ఇటలీ

ఇటలీలో ఆమెరికావారిసేనలు వాల్చర్నోనది నుండి ఉత్తరముగపోయి అనేక అనుష్ఠానములను ఆక్రమించి ఇపుడు కాపువా మైదానములో జర్మను సేనలపై క్రొత్త దెబ్బనువేయుటకు యత్నించుచున్నవి. క్యాపువా నుండి కాసినోపోవు రోడ్డు ఈసేనల చే ఆక్రమించబడేటట్లున్నది. ఈ రోడ్డు మీదుగా జర్మనుసేనలకు కావలసిన యుద్ధ సామగ్రులు పోవుచుండును.

మధ్యఇటలీలో బ్రిటిషువారిసేనలు బిందియా చూలోనుండి ఉత్తరమునకుండే ఇసర్నియాను పట్టుకొనబోవుచున్నవి. ఇసర్నియా నుండి ఈసేనలు ఉత్తరముగా రోంనగరానికి చేరబోవుటయేగాక దక్షిణము నుండియు పడమటినుండియు కూడ జర్మనుసేనలను ముట్టడితో ఇరికించుకొనగలుగును.

పీటికితూర్పున బ్రిటిషువారిసేనలు గూఫిలోనె సాముపడమునుండే మాంటేసిలోఫినుకు వెలుపలి యూటో ఒరాటినో, వాసో అను స్థానములను ఆక్రమించి ఇపుడు బారానెల్లోఅను చాల ముఖ్యమైన జర్మనుస్థానమును పట్టుకొనుటకై పోరాడుచున్నవి.

అక్టోబరు౨౨తేదీన ఇటలీమీద బ్రిటిషుమిత్రమండలివారివిమానములు చేసిన దాడులు సాంర్నోలో చాలగొప్పవని చెప్పుచున్నారు.

అన్నిరంగాలలోను తీవ్రమైన జర్మనుల ప్రతిదాడులు ఓడించబడినవి.

రోంనగరమునుండి అధికారులందరును ఉత్తరమునకుండే ప్రదేశాలకు వెడలిపోవుచున్నారు.

## ఆంధ్రమహాసభ చీలపల్లి పట్టి కమిటి స్థాపన

(స్వ. వి.) చీలపల్లి ౧౬-౧౧-౧౯౪౩

చీలపల్లిగ్రామమున్న, స్థానిక మరియు, ఆరెపల్లి కందాపురం గ్రామాల ప్రాథమిక సభ్యుల సమిష్టి సమావేశము శ్రీ వెంకటరాజేశ్వరజ్యోషి, మెదకు జిల్లా కార్యదర్శిగారిసమక్షములో జరిగి అధికార వర్గము ఎన్నుకోబడెను.

## అమ్మకము

(నాగపూర్ విశ్వవిద్యాలయమునకు కీ॥ శే॥ డా. లక్ష్మినారాయణ, కన్ట్రాక్ కంకాంప్టీగారు దానముచేసిన గృహరూపమైనఆస్థి)

శికింద్రాబాదు నందు (హైదరాబాదు- దక్కన్) మారేడుపల్లి కాలనీకి సమీపమున, బాగాత్ తాలూకాలో చేరిన మౌజె భూసరెడ్డిగూడ యందు ఆనంద్ భవన్ మాన్షన్ అని సామాన్యముగా ప్రఖ్యాతివహించిన ఒక అందమైన రెండస్థులబంగళా చుట్టుకాంపౌండులో వ్యవసాయమునకు ఫలవృక్షములకు అనుకూలమైనదై 7-23గుంటలభూమిగల్గి, 60అడుగులపొడుగు, 30అడుగుల వెడల్పుగు రాతికట్టడము కట్టినపక్కా బావి, దానికి రెండుమోటలు యింతేగాక ఎల్లప్పుడు నీటిసప్లై అగునట్లు ఎలక్ట్రిక్ మోటరు, పంపుకల్గియున్నది. ఈ భవనముందు ఉత్తమమైన ఎలక్ట్రిక్ ఫిట్టింగులు, ఆర్మసీలింగ్ పంకాలు, నూతన ఫ్లష్షింగ్ ఏర్పాట్లు సెప్టిక్టాంకుతోసహా, రెండుగ్యారేజులు, నౌకరుల గృహవసతులు, ఉత్తరపువైపున తీగెకంచెయున్నయున్నవి. రాజాలకు, మహారాజాలకు, నవాబులకు తగినట్లు అనుకూలముగా యుండగలదు.

కోరదలచిన వివరములను సీలుచేసిన కవర్లలోయుంచి యూక్రైవింటికి 31న వంబర్ నాడుగాని, అంతకు ముందుగా గాని చేరునట్లు పంపవలయును.

బేరములు, నాగపూరునందలి హైకోర్టుఆఫ్ జుడికేచర్ వారి ఆమోదమునకు లోబడియున నేగాని ఒప్పుకోనబడవు.

కార్యదర్శి

లక్ష్మినారాయణ బిక్వెస్ట్ ఎడ్మినిస్ట్రేషన్ కమిటి ఇన్స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ అమ్రావతిరోడు నాగపూరు.

# గోలకొండపత్రిక

స్వభాను సంః ఆశ్వీజ బ ౧౨ సోమవారము

## వీడోలు

పాతవైస్రాయిగారు పోయినారు. కొత్త వైస్రాయిగారు వేంచేసి యున్నారు. పాతప్రభువు కొత్త ప్రభువునకు అధికార మప్పజెప్పెను. చీర మార్చితే నాటకము మారనట్లుగా ప్రభువులుమారితే ప్రభుత్వముమారదు. అదే ఇంగ్లీషు రాజనీతిలోని రహస్యము. ప్రాచ్యులైన హిందూస్థానీవారికి మొగల్‌సామ్రాజ్యం వాసన ఇంకా పోలేదు. పాదుషాలు మారినప్పుడు కొత్త పాదుషావస్తే జనులు అతడు మంచివాడా చెడ్డవాడా చెడ్డవాడైతే, ఘోరాలు, చావులు, జప్తీలు. కొత్తపన్నులు, ప్రాతవజీర్ల ఉద్వాసన కొత్తవారి సంస్థాపన జరుగునని లెక్కలుకట్టేవారు. మంచివాడైతే పన్నుల మాఫీలు, మంచివజీర్ల నియామకము, ఖైదీల విడుదల, కఠినశాసనాలరద్దు, కొత్త జాగీర్ల సంప్రదానము, ఇట్టివెన్నో కలుగునని వారు. పాశ్చాత్యపద్ధతిలో అదిలేదు. పైగా వైస్రాయిగార్లందరూలార్డులే[ప్రభులే] అయినావారు రాజప్రతినిధులు. వారు పార్లమెంటులోని మంత్రివర్గమునకు దాసులు. వారేమి నిర్ణయింతురో దానిని నిర్వహింతురు. గట్టి పట్టుదల గల వైస్రాయి,అయితే మంత్రివర్గము వారి నిర్ణయముపై కొంతవరకు తన ప్రభావమువేయును.

ప్రపంచములో ఏ దేశమందుకానీ ఏ మూలలోకానీ వైస్రాయిపొందేజీతమంత టిజీతాన్ని పొందేఅధికారి లేనేలేడు. ఇది మొదటివిశిష్టత వైస్రాయిగారికి నెలకు ౨౦ వేలకుపైగా జీతముఖర్చులన్నీ ప్రభుత్వముదే. వారికిచ్చిన దివ్యభవనము నందనవనము. దానిలో 3000 గదులున్నవట. వైస్రాయిగారికుండు అధికారాలవంటి అధికారాలుప్రపంచములో మరేఅధికారికిన్నీ లేవు. ఇది రెండవ విశిష్టత. ఆజ్ఞలుచేయుటలో వైస్రాయిగారు సిద్ధసంకల్పులు పూర్వము వేలయేండ్లు తపస్సుచేసిన హిందూఋషులకు అట్టిసంకల్పాలుండేవట. ఏది తలచితే అది అగుట సిద్ధసంకల్పము. ఒక్కస్వాతంత్ర్య మిచ్చుటతప్ప తక్కిన ఏయాజ్ఞలైనా వైస్రాయిగారు సంకల్పమాత్రముచే చేసివేస్తారు, ఆర్డినెన్సు అధికారం వారికున్నది. మిలిటరీ శాసనాధికారము వారికున్నది- ఉద్యోగాలిచ్చు అధికారాలున్నవి- విచారణ లేకుండా దిగ్బంధనము చేయుటకున్నూ అనుగ్రహించితే వదలిపెట్టుటకున్నూ వారికి అధికారాలున్నవి శాసనసభలనే వున్నవికదా, అందు శాసనాలుచేస్తారు. అది ప్రజాశక్తినను తెలుపదా అని అందురేమో? వైస్రాయిగారికి "వీటో" రద్దు అధికారమున్నది- తమకు సరిపడిన శాసనాలుండనిత్తురు. సరిపడకుంటే రద్దుచేయుదురు.

వైస్రాయిగారు దేశీసంస్థానాలలోనికి వెళ్లినప్పటి దేవేంద్రవైభవము ప్రపంచములో ఏదేశమందును ఏఅధికారికిని జరుగనే జరుగదు వారు రానున్నారని తెలియగనే ఒక సంవత్సరం ముందునుండి ఏర్పాట్లు ప్రారంభమగును. "వైస్రాయిశాఖ" పునరుద్ధరింపబడును. చారులు ప్రత్యేకపోలీసుసిబ్బంది ఏర్పాటగుదురు. వారి సపర్యలకుగాను వస్తుసంబారము ను సేకరింతురు. వైస్రాయి కిచ్చేక్కి(డిన్నర్)విందుకులకులుఖర్చగును విందుకులోని ఒక్కొక్క ఆహూతుని భోజనానికి ఇంచుమించు ౬౦౦ రూపాయీలగును! శ్రీవారిభవనానికి, వారి షికారికి, వారి కళావినోదాలకు, వారినవరస వద్రసాభిరుచులకు మన దేశీరాజులు మహారాజులు రాజాధి రాజులు, నవాబులు ముఖ్యగు "ఆక్మీయఘనతలు" (Their Highnesses) చేయునట్టి ఏర్పాట్లు భూలోకములో మరెచ్చటనుచేయరు ఒక మహారాజుగారు ఒక వైస్రాయిగారి తేనీటికి కాచుటకై రూపాయీల నోట్లను కట్టెపుల్లలవలె కాల్చి "చా"ను చేసియిచ్చిరట. ఆ "చా" ఎట్టిదిగానుండెనోవైస్రాయిగారెంత పసందుచేసిరోయేమో!!

హిజ్. ఎక్సెలెన్సి లార్డు లిన్‌లిత్ గో వైస్రాయిగారు ఏడున్నరసంవత్సరాలు వైస్రాయిపదవి నలంకరించి రాజ్యముచేసిరి. వైస్రాయిల చరిత్రలలో ఇంత దీర్ఘకాలము భారతసామ్రాజ్యాన్ని పాలించినవారిలో వీరు రెండవవారు. శ్రీవారు ఏడున్నర ఏండ్లక్రిందట వైస్రాయిగా భారతదేశములో శ్రీపాదమునుంచినవెంటనే విత్తనంగోడెలు, విత్తనంగోడెలు అని స్మరించిరి వీరు వ్యవసాయిక వైస్రాయిగారు. "వీరురైతులను ఆదరించుతారు. వీరికాలములో పాడిపంటలు సమృద్ధిగానుండును"అనిఆనాడు రాజకీయ కాలజ్ఞాన తాత్త్వికులు జోస్యంచెప్పిరి.శ్రీవారుబాగానేప్రయత్నాలు చేసిరి. కాని నిత్యదారిద్ర్యదేశము మనది. పెద్దమ్మ పుట్టినిల్లుమనది. వారి దివ్యసంకల్పాలు నెరవేరలేదు. శ్రీరావారుపోయ్యేకాలములో బెంగాలులో ప్లేగుఎలుకలవలె అన్నార్తులు పటపట వీధులలో రాలిపోయిరి. శరత్తులోని ఆకులవలె ఇంకను రాలుచున్నారు. శ్రీవారి కాలములోనే ఆ కాంగ్రెసువారికేమి దుర్బుద్ధిపుట్టినోయేమో బ్రిటిషుసామ్రాజ్యముపై ముష్టియుద్ధము ప్రకటించిరి. పాపం వైస్రాయిగారుకాంగ్రెసువారిని జెయిళ్ళలో వేయించవలసినవారైరి. మహాత్మా గాంధీగారు ఒక అమెరికా విలేఖకునితో "నీకు తెలియదా లార్డులిన్‌లిత్‌గో నా చెలికాడు" అని సగర్వముగా చెప్పకొనిరి- కాని గాంధీగారు ప్రాయోపవేశము జెయిలులో చేస్తానన్నాడు, మిత్రులైన వైస్రాయి బహద్దరుగారు గాంధీగారిని సంతముచ్చు (Blackmailer) అని సెలవిచ్చిరి- పాపంవైస్రాయిగారికి పట్టరాని కోపమువచ్చినది. లేకపోతే అంతటి మాట వారు అనరు- అప్పుడప్పుడు ఇంగ్లీషుమహాజనులకు కోపమువచ్చును- చర్చిల్ మంత్రిశేఖరు డేకదా గాంధీకి 'అర్ధనగ్న పక్కీరు' అని బిరుదిచ్చినది- బిరుదులను నిరాకరించుడని ప్రచారము చేసిన పక్కీరయ్యకే ఒకముద్దైనబిరుదు!

ఈ కాంగ్రెసువారి మూలాన వైస్రాయిగారికి ఎన్నో అసాధారణశాసనాల [ఆర్డినెన్సులను] చేయవలసివచ్చెను- యుద్ధంకొరకు ఎన్నోచేసిరి. ఇన్ని ఆర్డినెన్సులనుచేసిన వైస్రాయిగారు మరొకరు లేరనవచ్చును. కాని పాపం వారేమిచేయగలరు- అది కాలమహిమ- పాతవైస్రాయిగారు ఏడేండ్లచిల్లరకాలములో చాలా పాటుబడినారు- వారు విశ్రాంతితీసుకొనుట చాలా అవసరం. వారికి వీడ్కోలుఇచ్చుచు సుఖీభవ అని అనుచున్నాము-

కొత్తవైస్రాయిబహాదరుగారికి స్వాగతం- వారేమైనా ప్రసాదింతురని జనులు ఆశపెట్టుకోగూడదు వారు కొత్తవారుకారు పాతవారే. దేశానికి పరిచితులే- వైస్రాయి మంత్రివర్గమువారే. వైస్రాయితర్వాత ముఖ్యమైన సైన్యాధికారముకలిగి యుండినవారే ఆనాడెట్లో ఇకముందును అట్లే యుండక యీ ముసలితనములో మారుదురా? అవిచ్ఛిన్నముగా సామ్రాజ్య పరిపాలన సాగుననుటలో సందేహము కానరాదు కొత్త వైస్రాయిగారికి స్వాగతం సుస్వాగతం-

---

### దీపావళి

విషాద పరిస్థితులలో ఈఏడు దీపావళి వచ్చినది. బెంగాలులో ప్రతివారము పదివేలకుపైగా చనిపోతున్నారు. ఇది అంటుజాడ్యముగా పరిణమించుచున్నది. ఉత్కళములో చావులు మొదలై వృద్ధినొందుచున్నవి. రాయలసీమలో ఘోరక్షామమున్నది.మద్రాసులో జలప్రళయంవల్ల కొందరు చచ్చిరి. ౧ లక్షమంది నష్టపడిరి- దేశమంతటను భుక్తిమానం (రేషన్) ఏర్పాటైనది- ఇట్టి పరిస్థితులలో మనకు విందులు చేసుకొను హక్కులేదు పటాకాలు కాల్చుట పాతకమగును- ఎవ్వరును పటాకాలపై ద్రవ్యము వ్యర్థముచేయగూడదు- కొత్తబట్టలు కట్టి మురవకూడదు- మనకీపండుగ విషాదముతోకూడినది- దీపములను విరివిగా వెలిగించి వ్యయము చేయుగూడదు- ఈవిధముగా మిగిలిన చిల్లర రాయలసీమ నిధికిని, బెంగాలుకును ప్రజలు పంపవలెనని మనవి చేసుకొనుచున్నాము-

---

### అలియాబాదు రెడ్డిజనసంఘము

పైసంఘముయొక్క తృతీయ వార్షికోత్సవము ౨౩ఆబాన్ నాడు సాయం ౫ గం॥ నుండి రాజా బహద్దరుగారి అలియాబాదులోని తోటలో శ్రీమాన్ పింగిలి వెంకటరామారెడ్డి దేశముఖుగారి అధ్యక్షతలో జరుగును-దక్కన్‌క్రానికల్ సంపాదకులును, డాక్టరు చెన్నారావుగారును, బిరుదు శేషయ్యగారును, మాన్ మంతరావుగారును రాజాబహద్దరుగారును మాట్లాడుదురు

౧౮-౧౦-౪౩

నారాయణగూడెములోని బాలికలఉన్నతపాఠశాలనుందిరమును విశాలపరచుటకును, సంస్థను యితరవిధముల అభివృద్ధిపరచుటకును కావలసిన ధనముకొరకు పాఠశాలకార్యనిర్వాహక సంఘసభ్యులు కొందరు జిల్లాలలోనికొన్ని ప్రదేశములకు విరాళములకై వెళ్లిరి. ఆ రికిని వ్యాధిమానులును పరోపకారులునునగువారు ఉదారబుద్ధితో ధనసహాయమొసగుచున్నారు అందుముఖ్యులు-

శ్రీయుతులు భువనగిరిసాంబయ్య సూర్యాపేట రూ౧౦౦౦ ఉమ్మెత్తకాంతరావు దేశముఖు సూర్యాపేట ౧౦౦౦, గోలి సీతారామయ్య భువనగిరం ౫౦౦, కన్యకాపరమేశ్వరీ రైస్‌మిల్లు భువనగిరం ౫౦౦, కాకోటి ఏకనాథం సాపూరు ౫౦౦ పుట్టపల్లిసీతారామారావు జనగాము సాపూరు ౩౦౦, నోముల లక్ష్మీనారాయణ, పెద్దినారాయణ జనగాము ౫౦౦, బద్దిశెట్టివెంకయ్యజనగాము ౫౦౦, దిశెగింరామయ్యజనగాము ౩౫౦, సేట్ కాలూరాం శోభారాం జనగాము ౩౦౦, కైలాసభూమన్న పాపన్నపేట ౧౫౦, జగన్నాథ్ పన్నాలాల్ జోగిపేట ౪౦౦, మోతీలాల్ గులాబ్ చందు మిలాప్ చందు ఎల్లారెడ్డి ౪౦౦, ఇతరములతో మొత్తము రూ. ౬౪౫౫.

---

### కేకలు వేసినందుకు శిక్ష

షోలాపూరు, అక్టోబరు౨౦

గాంధీజయంతినాడు కేకలను వేసినందుకై ముగ్గురికి ౩ మాసాలకఠినకారాగారవాసము, రూ౫౦ల జుర్మానా విధించబడినవి.

---

### మెహరలీగారి విడుదల

పూర్వపు బొంబాయి మేయరగు వై-జె-మెహరలీగారు జెయిలులో జబ్బుగానుండిరి. వారినిఅక్టోబరు ౧౯తేదీన వదలివేసినారు.

---

# విజ్ఞానవర్ధని

### ▣ శకద్వీప బ్రాహ్మణులు

క్రీ-శ. ౧వ శతాబ్దములో ఈరానునుండి అనేక పారసీకులు(జరథుస్త్రమతానుయాయులు) ఇస్లాంమతములోచేరక హిందుస్థానమునకు వచ్చిరి. వారు కాశ్మీరులో, పంజాబులో, దీనాకుమండలములో నిలిచిపోయిరి వారిలో పలువురు హిందువులలో లీనమైపోయిరి. కాని తమ సూర్యాగ్నుల పూజలను వదలకుండిరి. అట్టివారిని హిందువులు శాకద్వీపీయ బ్రాహ్మణులు అని పిల్చిరి.

### ▣ ప్రాచీన నజరానా

క్రీ-పూ. ౫౨౦ ప్రాంతాలలో రాజ్యముచేసిన ఈరానుదేశ చక్రవర్తియగు దారా (Darius)తనపేరును ధారయద్వసుఅని తన నక్షరుస్తుం శాసనములో చెక్కించుకొనెను. అంతేకాదు ఇంకా ఇట్లువ్రాయించెను. "అదందారయువోస్ .. పార్స పార్సహ్యాపుత్ర ఖఆరియ అరియచిత్ర" దీనికి సంస్కృతము "అహం ధారయద్వసుః పార్సః పార్సస్యపుత్రః అర్యః అర్యచిత్రః. దీని యర్థము" నేను ధారయద్వసువుఅను వాడను. పారసీకుడను. పారసీకపుత్రుడను, ఆర్యుడను ఆర్యవ శముచాడను) ఆర్యులు భారతదేశమువారేఅని వాదించువారు దీనిని గమనింతురుగాక! అట్టి దారాసితియన్ (శక రాజగు జనకైరస్(Jan Cyrus)కు తనకు సామంతుడై దాసోహంఅనుము అని వార్త పంపెను. శకరాజు ఏమియు ప్రత్యుత్తరమువ్రాయక ఒకపక్షిని, ఒక ఎలుకను, ఒక కప్పను, ఐయిదు బాణములను కానుకగాపంపెను. మోటుశకజాతివారి కానుకలిట్టివే కాబోలునని చక్రవర్తి సమాధానపడెను కాని శకమర్యాదలనుతెలిసిన ఒకవ్యక్తి ఇట్లనెను. "అగ్రదర్శకా (జహాపనాః)ఇవన్నియు యుద్ధసంకేతాలు. శకులు దాడివచ్చినప్పుడు పారసీకులు పక్షులైయెగిరిపోయినను, ఎలుకలవలె బొరియలలో దూరినను కప్పలవలె నీటమునిగినను వారిశరములు వెంటాడకమానవు అని పైనతెల్పినవాయొక్క అర్థము మహారాజాధి రాజోత్తమా!"

---

## ఆఫ్రికాలో భారతీయులకు అన్యాయముచేసి

# ప్రపంచంలో న్యాయస్థాపనకు రాయబారిగా పోవువారు

### దక్షిణాఫ్రికా ప్రధాని స్మట్సుగారిని గురించి విమర్శ

బొంబాయి, అక్టోబరు౧౯

దక్షిణాఫ్రికా భారతీయ కాంగ్రెసుకు ఇండియాలో ప్రతినిధులగు మహమ్మదుఅహమ్మదుజాద్వత్, స్వామి భవానిదయాళు గారలు కలిసి పత్రికలకు ఈక్రిందివిషయము ప్రకటనార్థమొసగినారు.-

స్మట్సుగారు ప్రపంచమందు న్యాయమైనట్టియు స్థిరమైనట్టియు శాంతిని పునాదివేయుటకై ఇంగ్లాండుకుపోవుచున్నారనియు, వారలు అమెరికాకు కూడ పోవచ్చుననియు మాకు తెలియవచ్చినది తన ప్రభుత్వము చాలతలవంపులైన భారతీయప్రతికూలశాసనమును చేసియుండగా తానుఈపనికి ఎట్లు పోదగుదురు? ఈఅన్యాయశాసనమును దక్షిణాఫ్రికాశాసనసభలో ౧౫మందిమాత్రమే సభ్యులుగల ఒకపార్టీకి అవకాశమిచ్చుటకై చేసిరి.

దక్షిణాఫ్రికాభారతీయకాంగ్రెసు ప్రతినిధులు కొందరు తమవిన్నపమును స్మట్సుగారికిచెప్పకొనదలచి, "దక్షిణాఫ్రికాలో భారతీయులహక్కు"లను గురించి ఒకపత్రమునుతయారుచేసిరి స్మట్సుగారు వారలకుదర్శనమిచ్చుటకే నిరాకరించుటగర్హితనము. ఆపత్రములో వారలు ఏనాగరికరాజ్యములోగాని మానవులైనవారలు అనుభవించు కనీసపు హక్కులను కోరిరి. దక్షిణాఫ్రికాలోభారతీయులను ఆరాజ్యపుపౌరులని ఒప్పుకొనవలెననియు, నివాసము వాణిజ్యము ఉద్యోగములకు సంబంధించిన విషయములలో జాతి పక్షపాతముతోకూడుకొనిన శాసనముల నన్నిటిని తొలగించవలెననియు, ఓటు హక్కును ఇవ్వవలెననియు, పాంఘికశాసనమువల్ల కలిగేబాధలను అనుభవించనీయవలెననియు, ప్రాథమికవిద్యను నిర్బంధవిద్యగా ధర్మముగాచెప్పించవలెననియు, కాలేజీలలోను విద్యాపీఠములలోను చేరనీయవలెననియు ఆపత్రములో అయిదంశములు కోరబడెను.

అమెరికాలో చైనీయులకు వెలివేయు శాసనమునురద్దుచేసి, వారలకు అమెరికనులపౌరస్వత్వపుహక్కులనిచ్చిన రూజ్వెల్టుగారికిని స్మట్సుగారికిని గలభేదము గమనించదగును. దక్షిణాఫ్రికా అనుభవించుచున్న క్షేమమునకు అబిసీనియాలోను, ఉత్తరఆఫ్రికాలోను భారతీయవీరయోధులు చేసిన సేవయే ఎంతో కారణము.

దక్షిణఆఫ్రికా భారతీయకాంగ్రెసు ఇండియాలో పత్రికలనుప్రజలను కోరుట ఏమనగా దక్షిణఆఫ్రికాలో భారతీయుల హక్కులను గురించి స్మట్సుగారు విశదమైనఒకప్రకటన చేయవలెనని ఇండియాప్రభుత్వమును, బ్రిటిషు ప్రభుత్వమును తొందరపెట్టవలెను. రంగుజాతులవారలకు రూజ్వెల్టుగారు చెప్పిన నాలుగుస్వాతంత్ర్యములను ఇవ్వని శాంతియేకాదు"

---

### వీరశైవమువల్ల సన్యాసము ప్రబలెను

౧౨, ౧౩శతాబ్దములలో వీరశైవమతము తెలంగాణములో అధికముగవ్యాపించెను సన్యాసముప్రజలనెక్కువగ నాకర్షించెను. దీనివల్ల దేశమానసంతానాభివృద్ధి నిరోధింపబడెను. అందుచేతమిశ్రా భార్యావివాహములను ప్రోత్సహించుటకై వివాహితులగుయువకులుగల కుటుంబములకు ధనసహాయము చేయుచుండిరి. ఈవిధమగు సంఘసేవ ఆకాలములో సాటిలేనిది. (శ్రీరాయప్రోలు సుబ్బారావుగారి అభిప్రాయము.)

---

### మాతృభాషకై ప్రార్థన

నాందేడుమరాఠీ సాహిత్యసమ్మేళనము గతవారములో జరిగెను. అందుఒకతీర్మానమిట్లున్నది- మరాఠ్వాడాలోని బళ్ళలో మరాఠీద్వారానే విద్యచెప్పించవలెను- హైస్కూలుఅంతమువరకు న్నూ చెప్పించవలెను.బాలికలకుమాధ్యమికతరగతివరకు ఉర్దూనిర్బంధం తీసివేసిన అనుగ్రహానికి ధన్యవాదాలు-మరి పైతరగతులకుకూడా అట్లే అనుగ్రహించవలెను. కాలేజీన్ని, బాలికామాధ్యమికపాఠశాలలో ఉర్దూ తీసివేయవలెను. హై. (ప్రజా) విద్యామహాసభవారు మాతృభాషలవిషయమై చేసిన తీర్మానములో సంపూర్ణముగా ఏకీభవించుచున్నారట.

---

### ఇంగ్లాండుపై నవనగర్ సంస్థానాధీశుని భక్తి

అక్టోబరు ౧౪తేదీనఫ్రాత్తఢిల్లీలో నరేంద్రమండలి సమావేశము సమాప్తమయ్యెను. దానికధ్యక్షుడగు నవనగర్‌సంస్థానాధీశుడు జంసాహెబుగారు ఇట్లుఉపన్యసించిరి:—

"సమయమురాగానే ఇంగ్లాండుతనమిత్రులనుశత్రువులతోచేరుటకు వదలుననియు, అవిధముగాశత్రువుకు చీకాకుపెట్టవచ్చుననియు ఉదారభావములులేనివారలు అప్పుడేమమ్ములను హెచ్చరించుటకుప్రారంభించినారు. ఇంగ్లాండుచేయు వాగ్దానములోను, చేసినవాగ్దానములను ఇంగ్లాండు పాలించుననువిషయములోను మాకు సంపూర్ణవిశ్వాసమున్నది. మరిన్నీ నేనుసైనికుడను రాజకీయమనుష్యుల కుజ్ఞాపకము తక్కువయుండవచ్చును కాని, సైనికులుతమసహచరులను మరచువారుకారు."

---

### శికింద్రాబాదు ఆయుర్వేద ధర్మ వైద్యశాల

శికింద్రాబాదు కంజరిగూడెంలో స్థాపితమైన "శ్రీ ఆయుర్వేదధర్మవైద్యశాల" యందు సెప్టంబరు ౧౯౪౩వమాసమున చికిత్సగావింపబడినవారి సంఖ్య ౫౮౯-అందు ౧౦౪-పురుషులు, ౧౬-౭ స్త్రీలు, మరియు ౨౫౧౬-శిశువులు

ఇట్లు

శ్రీరంగం రామమూర్తి.

## ని. రా. ఆ. సా. పరిషత్తు

ఖమ్మంలో
ఉపసమితి స్థాపన

(ఒ-వి) ఖమ్మంమెట్టు, ౧౫ అక్టోబరు ౧౯౪౮ తేదీ సాయంకాలము ని-రా ఆ- సారస్వతపరిషత్తుయొక్క ఉపసమితి ఖమ్మంలో స్థాపించబడెను.

సమావేశానికి శ్రీ ఆకుల పూర్ణానందము, కంచర్ల నాగేశ్వరరావు, డాక్టరు రామచంద్రరావు యల్లాప్రగడ కృష్ణమూర్తి, బూర్గుల రంగనాథరావు గార్లు, కాక సుమారు యిరువదియైదుగురు ప్రాథమిక సభ్యులు దయచేసిరి. తాత్కాలిక అధ్యక్షులుగానుండిన శ్రీ కోదాటి నారాయణరావుగారి ఆధ్వర్యంలో సమావేశ కార్యక్రమము జరిగెను.

తొలుదొల్త శ్రీ నారాయణరావుగారును, తాత్కాలిక కార్యదర్శిగానుండిన శ్రీ దాశరథి కృష్ణమాచార్యులుగారును, పరిషదుద్దేశములను సభికులకు దెలియపరచి, ఖమ్మంలో కూడా ని-రా-ఆ-సా-పరిషత్తుయొక్క ఉపసమితిని స్థాపించుటగురించి నొక్కిచెప్పిరి. పిదప శ్రీ యల్లాప్రగడ కృష్ణమూర్తి, నాగేశ్వరరావు, పాపారావు, రంగనాథరావుగార్లు తమ తమ యభిప్రాయములనొసంగిరి. పరిషత్తుయొక్క పరీక్షలకు సిద్ధముకాదలచువారికి ఉచితముగా బోధనాదిసౌకర్యములు గలిగించుటకు శ్రీ కోదాటి నారాయణరావు దాశరథి కృష్ణమాచార్యులు బూర్గుల రంగనాథరావుగార్లు అంగీకరించిరి.

పిదప ఈ క్రిందికార్యనిర్వాహకసభ్యులు ఏకగ్రీవముగా ఎన్నుకోబడిరి. అధ్యక్షులు-శ్రీ ఆకుల పూర్ణానందముగారు, ఉపాధ్యక్షులు-శ్రీ డాక్టరు రామచంద్రరావుగారు, సంయుక్త కార్యదర్శులు-శ్రీ దాశరథి కృష్ణమాచార్యులుగారు, శ్రీ యల్లాప్రగడ కృష్ణమూర్తిగారు.

కృతజ్ఞతల తరువాత ౮-౩౦కు సభాకార్యక్రమము ముగిసెను.

### బొగ్గులకుంట ధర్మశాల

౧౬-౧౦-౧౯౪౮.

సుమారు ౫౦ సంవత్సరములక్రిందట శ్రీ విక్టోరియా రాణిగారి ఆజ్ఞ ప్రకారము బొగ్గులకుంటలో మంచిధర్మశాల, ప్రజలనుండిడబ్బుప్రోగుచేసి కట్టబడినది. హైద్రాబాదులో హోటల్ మరియు ధర్మశాలలు లేనిసమయమున చాలామంది జిల్లాలనుండి హైద్రాబాదుకువచ్చినప్పుడు నివసించుచుండేవారు రెసిడెన్సీయిలాకాలోయున్నప్పుడు ఈ ధర్మశాలయొక్క తాళముచేతులు పోలీసుఠాణాలోయుండెడివి. తరువాత ప్రభుత్వనిర్మాణశాఖ ఉద్యోగియగు శ్రీ దక్షిణామూర్తిగారు తమవద్ద తాళముచేతులుంచుకొనేవారు. ఇప్పుడు అట్టిధర్మశాలలో బద్రియా అమీనుకచ్చేరికొంత, మరియు ఉద్యోగుల సొంతమువాడుకకు కొంత, సర్కారీ బియ్యము విక్రయించు దుకాణమునకు కొంతభాగములుగ తీసుకొనియున్నారు ఈ బొగ్గులకుంట ధర్మశాలలోని భూమిని కొంతభాగము బాలికలపాఠశాలకు ఉపయోగించుచున్నారు. కొంతభాగము స్త్రీలకు క్లబ్బుకును పయోగించుకొనుచున్నారు. కొంతభాగము జమ్నాసియంగానున్నది. ఇప్పుడు నగరాభివృద్ధిశాఖవారు అందులోనుండి దారివేయుచున్నారు. పైధర్మశాలస్థితి యిట్లున్నను మంచెట్లుండునో తెలియదు.

ఒక ముసాఫిర్.

### ఆంధ్రభవన నిర్మాణనిధి వసూళ్లు

సూర్యాపేట

శ్రీ కందూరు సింగమ్మదొరసాని ౨౨౧, రామలింగేశ్వరమిల్లు ౧౫౧, వేణుగోపాలస్వామిమిల్లు ౧౫౧, మైలవరపు పెరుపెద్దోజి ౧౧౬, వేములపల్లి వెంకటకృష్ణయ్య ౧౧౬, గవ్వ అమృతరెడ్డి ౧౦౧, తల్లాడ లక్ష్మయ్య ఈగా కిష్టయ్య ౫౧, యామా రామ నరసయ్య ౫౧, యామా లక్ష్మయ్య బ్రదర్సు ౫౧, సోమా శివయ్య ౫౧, వెంపటిబుచ్చయ్య ౫౧, వీరవల్లి రామయ్య ౫౧, సోమా గురువయ్య ౫౧, ఉప్పలగోపయ్య ఊర్లపాటి వెంకట్రామయ్య ౫౧, శింగిరికొండ సత్యనారాయణ ౫౧, కోమాటి వెంకటేశ్వరరావుగారు ౫౧, బాసా సత్యనారాయణ ౫౧, చార్లగడ్డ లచ్చయ్య ౨౫, అమరవాది వెంకటనరసయ్య ౨౫, ఏలూరి నరసింగరావు ౨౦, చౌకేట రామిరెడ్డి, ౧౧. ఇప్పటికి మొత్తము వసూళ్లు రు. ౧౮౩౭-౦-౦.



## గుల్బర్గాషరీఫ్ యాత్రికులకు రైలు నిరాకరణ

నవంబరు ౯ తేదీమొదలుకొని ౨౩ తేదీవరకు జి-ఐ-పి- రైలుబండ్లలోను, యం-యస్-యం- రైలుబండ్లలోను ప్రయాణముచేసేవారలకు గుల్బర్గాలో ఖాజాబందానవాజ్ షరీఫ్ కు పోనిరాదనే తప్పవారలకు శాలోట్, బారోటి, దుధ్నీ, కులాలి, గంగాపూరు, సవాల్గి, గుల్బర్గా, మార్తూరు, షాహాబాదు, వాడీ, నాల్వారు, యాద్గిరి స్టేషనులకు టిక్కెట్లను యివ్వరాదని బొంబాయి ప్రభుత్వము వారు ఆజ్ఞాపించినారు.

## సిద్ధాంత వాతావరణము

(శ్రీ టి- వి- భాస్కర్ గారు)

౭ నవం-కార్తీక శు॥౧౦ ఆదివారము ఈ దినము మేఘములు గాలిచేసరించి తుషారవృష్టి ఖండవృష్టి యిక లుగును-శీతము తగ్గును.

౮. నవం-కార్తీక శు॥౧౧ సోమవారము ఈ దినము అతిశీతముగను మంచు, వర్షము, చల్లనిగాలి చీకటి యిదిక లుగును

౯. నవం-కార్తీక శు॥౧౨ మంగళవారము ఈ దినము సంతోషకరముగను కొద్దిశీతముతో కూడి యుండును.

౧౦. నవం-కార్తీక శు॥౧౩ బుధవారము ఈ దినము కొద్దియుష్ణమును, కొద్దిశీతముగను మంచుతో కూడుకొని యుండును

౧౧. నవం కార్తీక శు॥౧౪ గురువారము ఈ దినము వాతావరణము మారుచుండును. మేఘములు గాలిచేసరించి, ఖండవృష్టి కలుగును.

౧౨. నవం-కార్తీక శు-పౌ-బ॥౧ శుక్రవారము ఈదినము కొంచెము కటిక చినుకులుండును, వర్షమధికముగ నుండును.

౧౩. నవం-కార్తీక బ॥౨ శనివారము. ఈదినము కొద్దివర్షము, శాంతము, మనోహరముగ నుండును.

౧౪. నవం-కార్తీక బ॥౩ ఆదివారము. ఈదినము ఉష్ణము హెచ్చును. మనోహరముగ నుండును.



## మా సంశయములు యథాప్రకారముగనే

శ్రీ నిజాంకళాశాల సంస్కృతాంధ్రోపన్యాసకులగు బ్ర॥ కురుగంటి సీతారామయ్యగారొసంగిన ప్రత్యుత్తరమును చూచితిని.

౧ పత్రికాధిపతుల జోలికిబోవుట అనావశ్యము.

౨ 'మిక్కిలి సభ్యతతో' ననిరి. నేనుకథాత్రయి నిరూప నుదహరించియుంటిని. దానివిషయము ప్రత్యుత్తరములో మరచిరి బ్రహ్మశ్రీగారి గ్రంథములందు అసభ్యములగు పదములున్నను నేను మాత్రము సభ్యమైనపదములనే వ్రాసియుంటిని, అందున్న పదములనుకొన్నిటిని జట్కావాలాలు సహితము వ్యవహరించరని అంటిని అట్టివిధముగ నెవరును వ్యవహరించరనుటకు అవిధముగ వ్రాసితిని. శ్రీవారు జట్కావాలాలు ఉపయోగించుపదములను వ్రాసిరని నాలేఖయందు లేదు

౩ నవ్యసాహిత్యవీథులు ౫౦వ పుటలో "సాహిత్య సంగీతాలు పరస్పరాశ్రయాలు కాబట్టి యిది కూడ నాకు ప్రస్తుతమైనదే," అనిసంగీతమునందు శ్రీవారు సంబంధము కల్పించుకొనినవిధముగ నేను కూడ సాహిత్యమునందు సంబంధమును కల్పించుకొనకతప్పినదికాదు. అయితే నవ్యసాహిత్యవీథులందున, కథాత్రయి మందును శ్రీవారు వినియోగించిన భావనమాత్రము నేను వ్రాయజాలకపోతిని.

౪ అందరన్నివిధముల సాహసించుచుండ నేను మాత్ర మూరకుండుటెందులకని సాహసించుచుంటిని. అస్మదాదులెట్లు వ్రాసినను అడుగువారుండరు. పండితులిట్టివిధముగా వ్రాసినందునరసికులకు విచారించవలసివచ్చినది. పాత్రౌచిత్యమునకనుసరించి వ్రాసిరనుటకు వీలుకలుగకున్నది. ఈవిధముగ వ్రాయుటకు కారణము యూహింపజాలకపోతిని.

౫ పానుగంటివారి ప్రకీర్ణకోపన్యాసములను చదివిన ౪౦ సంవత్సరముల చరిత్రయంతయు తెలియగలదు దానినిచదివితిని. ఇంకాకొన్నివిమర్శనలను, నవ్యసాహిత్యరచనలను చదివితిని. ఒకసంవత్సరము నేనుగూడ నవ్యసాహిత్యసభ్యుడనే, మిత్రులుభావము మార్చుకొని నావ్యాసమునుగూడ మాటినిప్రతిభలో ప్రకటించుకొనిరి. ఒక సంవత్సరముబందరులో జరిగిన వార్షికసభలో నుపన్యసించియుంటిని. ౪౦ సంవత్సరములక్రిందట జరిగినచర్చలో పాల్గొనని కొన్ని తెలియకపోయిన ప్రమాదము లేదు సంవత్సరములు ౪౦ గడిచినంతమాత్రమున స్థిరమైన పరిణామము కలిగినదనుకొనుట సాహసముకాకపోవచ్చును ఆంధ్రులందరు అందులకు బద్ధులుకొనుటపొరబాటగును.

౬ 'నిజంగా వృద్ధికోరినట్టయితే వ్యవహారంలో వున్న భాషను స్వీకరించితీరాలి' అనివ్రాసిరి

నేను సర్వజ్ఞుడనుకాను. కాని శ్రీవారునిజముగా వృద్ధినికోరువారగుచో 'కథాత్రయి, అనుపదము విప్రాంతమందు ఏనాడువాడుకలోనుండెనో తెలుపగలరు మాకుకథలను. నిజముగా వృద్ధినికోరువారిభావమైన మాకుకతలందురు కథాత్రయిఅనునది బ్రమకాదంటిమేని వ్యాకరణసాహిత్యములతోపాటు వీరికిం కాభాష యునవేమోకూడ తెలియనట్లున్నదని సెలవిచ్చెదరు. చెప్పనకిచేయుచోలోకమునకు ఉపయోగమున్నను లేకపోయినను దానిలోకపద్ధతిగాగ్రహించవచ్చును, ఒకపద్ధతికిడకనియమమునకు కట్టుబడి 'నిజంగావృద్ధినికోరినట్టయితే శ్రీవారు తంజావూరాంధ్రనాయకులచరిత్ర మున్నగువాని నావిధముగ వ్రాయుటకు కారణము బోధపడదు ఆవిధిలుకపలుకులనితెనుగిరిగ్రహించియుండరుకాబోలును.

౭ గ్రంథమునచ్చువేసుకొని అభిప్రాయముల నొసంగవలసినదిగ ప్రార్థించిన సదభిప్రాయముల నొసగుటలోక సహజము అని బ్రహ్మశ్రీగారేతమ నవ్యసాహిత్యవీథులలో వ్రాసినారు. సదభిప్రాయములను పరమప్రమాణముగ గ్రహించి అందులకయావదాంధ్రదేశమునకుగల పండితులందరు ఆమోదించిరనకొనుట పొరబాటగును. నవ్యసాహిత్యవీథులు కథాత్రయి, అను శ్రీవారి గ్రంథములలోని భావనం గీకరించినవిజ్ఞులు ఆంధ్రదేశమందు వేళ్లకెక్కదగినవారు నవ్యసాహిత్యవీథులు, అనుగ్రంథముసాహిత్యగ్రంథముకాదని నా యభిప్రాయము అదొక విషమగకేటలాగు అదియు నసంపూర్తిగనున్నది ఇట్లేలోకము భిన్నాభిప్రాయములతోనున్నను అందరికి భిప్రాయములు శ్రీవారికినెరిగించుటకు నవకాశము కలుగినంతమాత్రమున శ్రీవారిగ్రంథము నసాహిత్యగ్రంథముగను, అందలిభావమంతయు పరిశుద్ధమైనదనియును యావదాంధ్రలోకము సాదరముగ దలచునని అనుకొనుచున్నారని తలంచుట పొరబాటు

౮ శబ్దసిద్ధిలోకమువలన కలగినదట వాస్తవమే. కానిశబ్దమాత్రము సామాన్యలోకము వలన కలుగదనిమనవి జట్కావాలాలు, అచ్చినాడు అచ్చినదు- అస్తడు- అస్తాను- ఇగో- చానచాన- చేపిచి- పెట్టిపయవలె- మున్నగుపదములను వ్యవహరింతురు. అశబ్దాలు శబ్దసిద్ధికిలోబడునే మోకానికప్పుశుద్ధిమాత్రము తోచ్చెదవు.

ఉచ్చనీచములగు, సభ్యాసభ్యతలగు, గౌరవాగౌరవములనుగనునించి ఉత్తమభాషలో గ్రంథములను రచించుటవెందులకో తెలియవలయునని మంత్రము యొక్క ప్రయోజనమును, శాస్త్రప్రయోజనమును సర్వతోముఖముగ తెలిసికొనుటఅవసరము. రాష్ట్రీయులన్నిటికిని సమిష్టిభాషకు పరిణామే అన్నిప్రాంతములవారికిని సర్వకాలములందును చెల్లుబడియగుటకు గాను నీతినియమములుగల భాషయే ప్రయోజనకారియగును పరిశుద్ధమగు భాషను మాత్రమే విజ్ఞులు గౌరవింతురు వ్యాకరణమునందుగల 'శబ్దసిద్ధిలోకమునందు కలుగుననియున్నంత మాత్రమున యిచ్చవచ్చినట్లు వ్రాయవచ్చునని గ్రహించుట పొరబాటు.

౯ 'సాహిత్యము' అనుపదముయొక్క ప్రయోజనము, ఎట్టియోగ్యతగలవారు సాహిత్యపదములో అనివమములు. ఎన్నిటికిని తాయవాలకాజాలవు నేను కలుగుచుట్టినవారందరును సాహిత్యపరులని కొందరనిన రేపుతెలుముద్రణుచేయువారుకూడ సాహిత్యపరులేలని కొందరందురు. దీనికొకనియమము మున్నది. తెలుముద్రణచేయువారు వ్రాయలేనంత మాత్రమున సరిభావములు లేవందురా అట్టివారు మరొకరిచేత వ్రాయించగలరు అప్పుడు వారిసాహిత్యమువలన లోకోపకారమగునున్నది. ఈ విషయముగూడ సాహిత్యప్రయోజనము తెలిసినగాని తేలదు

౧౦ ఎంతగొప్ప వైయాకరణిఅయినా సామాన్యవిద్యాంసుడేవడో జీవద్భాషప్రమాణభూతమైన అనుశాసనంచేశాడంటే అస్మదాదులము అంగీకరించలేము.

"అంగీకరించలేము" అనువాక్యము సర్వజ్ఞులవాక్యము అస్మదాదులమన హైదరాబాదాంధ్రసాహిత్యపరిషత్తువారై యుండవచ్చును. అస్మదాదులు సామాన్యవిద్వాంసులు కానటుల స్పష్టమగుచున్నది. జీవద్భాషకనుశాసనముచేసిన విద్వాంసుడు సామాన్యుడెవడోనట. అప్పుడు శ్రీ రెంతటివారో ఊహించుటకు నలవిగాకున్నది. శ్రీవారు నామీదకోపముతో సామాన్యులు కాని విద్వాంసుని దూషింపకుండిరి. 'విద్వాంసుడెవడోనట' సన్యాసపదములిట్టివేకాబోలును. అయిన శ్రీవారుసర్వజ్ఞులుగాన ప్రమాదములేదు. కాని శ్రీగారు తమప్రత్యుత్తరములోను దహరించినవారందరు సామాన్యులుకారు కాబోలును, ఎందులకో.

౧౧ "ఆదివరకు మనకువున్న వ్యాకరణగ్రంథాలన్నీ వచనభాషకోసంకాదు"

పద్యభాషట- వచనభాషట-ఏ వ్యాయముప్రకారము మిట్లువిభజించిరో తెలియకున్నది.

౧౨ ప్రత్యుత్తరములో శ్రీవారు "వ్రాయుట అనుపదములో వ్రాయనుప యోగించిరి. నవ్యసాహిత్యవీథులలో ఒకపర్యాయము వ్రాశాడని ఆదేపుటలో రాశాడనిరి. నిజంగావృద్ధినికోరువారిందులోనే మార్గమున ననుసరించవలయునో తెలియకున్నది.

౧౩ మేము మనకు జేసిన సంశయమునకు ప్రత్యుత్తరము రాలేదు. శ్రీవారు రెట్టిభాషనువ్రాసి కృతార్థులయినదియు, నిత్యమును శ్రీవారు రెట్టిబాషగల గ్రంథముల రెట్టిభాషలో పాఠములు చెప్పుచుండినదియు శ్రీవారుండుకళాశాలలోని విద్యార్థులు శ్రీవారికథాత్రయి, నవ్యసాహిత్యవీథులు గ్రంథములలోనిభాషను బోలినభాషనుగాని వ్యాకరణాది నియమరాహిత్యమునైన మరొకభాషలోగాని పరీక్షాపత్రములను వ్రాసినచో వానిపరీక్షలలో కృతార్థులనుగ జేయుదురేమో తెలుపవలసినదిగ నుకోరియుంటిమి. ఆవిషయమై వ్రాయకుండిరి. కాబట్టి మా సంశయములు యథాప్రకారముగనే యున్నదనిమనవి

పుచ్చా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి.

